చేయుచుండెను. ఆయన యొద్దకు తెనాలి పోలీసు సబిన్‌స్పెక్టరు వెళ్ళి సీతారామరాజు తల్లి, తమ్ముని గురించి భోగట్టా చేసెను. "అతనిని నేనే అక్కడకు పంపితిని. ఆ భూములు మావే" అని డాక్టరుగారు చెప్పి, "నీవు పోలీసు వారితో అబద్ధమాడితివట, అట్లు ఎప్పుడును అబద్ధమాడగూడదు" అని పిదప ఆయన తమ్మునికి ఉత్తరము వ్రాసిరి.

తరువాత ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించుటకు రాజు తమ్ముడు ప్రయత్నించెను. సీతారామరాజు తమ్ముడు అను కారణమున భద్రాచలము సబ్‌కలెక్టరు అక్కడ ఉద్యోగమిచ్చుటకు నిరాకరించెను. పిమ్మట 1934లో తూర్పుగోదావరి జిల్లా బోర్డులో ఉపాధ్యాయునిగా ప్రవేశించి, ఉద్యోగము చేసి, విరమించి పెద్దాపురము తాలూకా జగ్గం పేట వద్ద నున్న బూరుగుపూడిలోస్థిరపడి ప్రభుత్వము నుండి పింఛను పుచ్చుకొనుచు ప్రస్తుతము కాలక్షేపము చేయుచున్నారు.

1947లో స్వాతంత్ర్యము సిద్ధించిన తరువాత సీతారామరాజు తల్లి రాజకీయ బాధితులుగా ప్రభుత్వ సహాయము కొరకు మద్దూరి అన్నపూర్ణయ్యగారు, రెబ్బా ప్రగడ మందేశ్వర శర్మ (కొవ్వూరు) గారల ప్రేరణతో దరఖాస్తు పంపియుండిరి. అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షుని హోదాలో భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి చేత కూడ సిఫార్సు చేయించి అప్పటి మద్రాసు ముఖ్యమంత్రియగు శ్రీ పూసపాటి కుమారస్వామి రాజాగారికి మందేశ్వరశర్మగారు స్వయముగా ఇచ్చియుండిరి. కాని జైలుశిక్ష పొందలేదను నెపముతో ఎట్టి సహాయమును జరుగలేదు. దీనికామె ఇట్లు చింతించెడువారు. "నా చిట్టిబాబు (శ్రీరామరాజు) కాంగ్రెసుకు మార్గదర్శకుడు. 1921 సంవత్సరములోనే మద్య నిషేధమును అమలు జరిపెను. పంచాయితీ కోర్టులు స్థాపించెను. దేశ స్వాతంత్ర్యమునకూ బ్రిటిషు ప్రభుత్వమును పారద్రోలవలెనని తిరుగుబాటు చేసెను. నా కుమారుని వంటివారు అనేకమంది ఆత్మబలిదానము చేయుట చేతనేనేడు స్వాతంత్ర్యము సిద్ధించినది. అఖిల భారత కాంగ్రెసు సిఫార్సును గూడ త్రోసిరాజను కాంగ్రెసు ప్రభుత్వము నేడు పరిపాలించుచున్నాదా? బ్రిటిషు ప్రభుత్వము సహితము 50 ఎకరముల భూమినిచ్చి, పశువుల నిచ్చి, ఇండ్లు కట్టించి, పంట పండు వరకు అన్నిటిని సప్లయి చేయు ఏర్పాటు చేసిరి. కాని జాతీయ ప్రభుత్వము కదాయని ఒప్పుకొనినను తిరస్కరింపబడెనా? నా యోగమును బట్టి వారికాబుద్ధి సర్వేశ్వరుడు తోపించినాడు" అని ఆమె వాపోవుచు రామనామస్మరణలో బడెడువారు. ఈ విధముగా చింతించుచు కాలము వెళ్ళబుచ్చుచు 1953 అక్టోబరు 30వ తేదీని (విజయనామ సంవత్సర ఆశ్వయుజ బహుళ నవమీ శుక్రవారము మధ్యాహ్నము 2 గంటలకు) ఆమె 77వ యేట చిన్నకుమారుని వద్ద కాలధర్మము నొందిరి.

సీతారామరాజు సోదరియగు దంతులూరి సీతమ్మగారు తీసువరములో ఆమె కుమారుని వద్ద నుండి 1964 జులై 18 తేదీని పరమపదించిరి.

# పరిశీలించిన ముఖ్య గ్రంథములు, పత్రములు


| | | |
|---|---|---|
| 1. | అల్లూరి సీతారామరాజు ప్రశంస | - భమిడిపాటి సత్యనారాయణ (1925) |
| 2. | అల్లూరి సీతారామరాజు చరిత్ర<br>(రంప పితూరి)<br>(ఎమ్. కృ. రా) | - కలియుగార్జున ఎమ్. కృష్ణారావు<br>(కొండపల్లి వీరవెంకయ్య బుక్<br>సెల్లర్స్ అండ్ పబ్లిషర్స్,<br>రాజమండ్రి, 4వ ముద్రణ, 1926) |
| 3. | అల్లూరి సీతారామరాజు<br>(పొ. రా. కృ.) | పొన్నలూరి రాధాకృష్ణ మూర్తి<br>(లాల్‌పబ్లికేషన్స్, గవర్నరు<br>పేట, బెజవాడ, 1938) |
| 4. | The Great Rebel in Andhra<br>Sri Alluri Sitarama Raju,<br>a phase in the Freedom Movement | Y. Vittal Rao<br>(J.A.H.R.S. Journal,<br>Vol. XXIV, P. 29-34, 1956) |
| 5. | అల్లూరి సీతారామరాజు చరిత్ర-<br>(య.న.రా.) | యర్రమిల్లి నరసింహారావు,<br>(అల్లూరి సీతారామరాజు<br>స్మారక సంఘము,<br>ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము,<br>హైదరాబాదు, 1961) |
| 6. | అల్లూరి సీతారామరాజు జీవిత చరిత్ర<br>(కొ.ల.నా.) | కొడాలి లక్ష్మీనారాయణ<br>(Research Institute,<br>Moparru, Tenali Tk,<br>Guntur Dist., 1965) |
| 7. | అల్లూరి సీతారామరాజు అను<br>శ్రీరామరాజు నిజ చరిత్ర<br>(శే. శ్రీ.రా) | శేఖర మంత్రి<br>శ్రీరామ చంద్రరావు<br>(అల్లూరి సీతారామరాజు<br>మెమోరియల్ సంఘం, |

| | | |
|---|---|---|
| | | రాజేంద్రపాలెం, కొయ్యూరు P.O., విశాఖ జిల్లా, 1983) |
| 8. | అల్లూరి సీతారామరాజు (నాటకం) | - పడాల రామారావు |
| 9. | ఆంధ్రశ్రీ (నవల) | - పడాల రామారావు |
| 10. | జ్ఞాపికలు (వ్రాతప్రతి) (అ.స.నా.రా.) | - అల్లూరి సత్యనారాయణ రాజు (సోదరుడు) |
| 11. | A.J. Happell's Report | - (G.O. No. 572 Pub. Dept. dated 23-7-1923 of Madras Govt.) |
| 12. | The Freedom Struggle in Andhra Pradesh, Vol. III (F.S.A.P.) | - Prof. M. Venkata Rangaiya, (A.P. State Committee, 1965) |
| 13. | Struggle for Freedom Vol. XI | - R.C. Majumdar and A.K. Majumdar. (Bharatiya Vidya Bhavan, Bombay, 1969) |
| 14. | Visakhapatnam District Gazette, (V. Gaz.) 1979 | - Dr. N. Ramesan |
| 15. | East Godavari District Gazette, (E. G. Gaz.) 1979 | - Dr. N. Ramesan |
| 16. | శ్రీ ఆంధ్ర క్షత్రియ వంశరత్నాకరము, ప్రథమ భాగము (ఆం.క్ష.ర) | - బుద్ధరాజు వరహాల రాజు, బి.ఎ. (పిఠాపురం, తూర్పుగోదావరి జిల్లా, 198?) |
| 17. | Alluri Sitarama Raju, Hero of the Rampa Rebellion, 1922-24 (P.K.M.) | - Pala Krishna Moorthy (Viplavajyothi Alluri Sitarama Raju Yuvaka Kendram, Poduru, W.G.Dt. 1983) |
| 18. | ఈ పితూరికి సంబంధించిన ఆనాటి ప్రభుత్వ పత్రములు, నివేదికలు. | |

విప్లవవీరుడు

# అల్లూరి సీతారామరాజు చరిత్ర



రచయిత: దంతులూరి వెంకటరామరాజు, ఎం.ఎ.